The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

సం॥ చందా రూ ౭-౦-౦
అర్థ ,, ,, ౩-౧౨-౦
విడి ప్రతిక ౦-౧-౪

హైదాబాదు, (దక్కన్.)
GOLCONDA PATRIKA
HYDERABAD, (DN.)

ఒకవారము తరువాత ప్రాతఃప్రతికకోరిన వెలకు పరిమితి లేదు.

సంపుటము ౭ } శా. శ. ౧౮౫౪ ఆంగీరసనామ సం॥ ఆశ్వీజ బ॥ ౮ శనివారము 22-10-32 { సంచిక ౪౭

## మతము వలన ప్రపంచమున కేమిలాభము..?

లాభముకన్న నష్టమే కలిగినది!

చిత్రగుప్తుడు.

మతమనగా ప్రత్యేక గ్రంథము యొక్క లేక వ్యక్తియొక్క బోధ యను నభిప్రాయముతో నేను వ్రాయను. వ్యక్తులబోధలు, గ్రంథములు—అందు ఆచార నిబంధనలుకూడ చేరినవి—అన్నిటి సముదాయమే మతమని నిశ్చయించి తర్వాత ప్రధాన విషయమునకు వత్తును.

ప్రపంచములో నానా మతములు, నానాభాషలు వివిధాచారములు, వివిధ విశ్వాసములు, అనాదినుండియు, ప్రబలియున్నవి అందు ప్రధానమైన మతములు. వైదికము, క్రైస్తవము, ఇస్లాము, బౌద్ధము, జైనము, అగ్నిస్తామతము ఈ మతములకు ప్రధాన గ్రంథములు వరుసగా వేదములు, బైబిల్ (ప్రాతది, క్రొత్తది) ఖొరాన్, త్రిపిటకాదులు, అర్హంతుల యొక్కయు, తీర్థంకరుల యొక్కయు బోధలు, జందవెస్టా మున్నగునవి.

ఈ వివిధ మతములవలన ప్రపంచమున కేమైన లాభము కలిగినదాయని విచారింతము. నాయభిప్రాయమున ప్రపంచాభివృద్ధి యీ మతముల మూలముననే చాల వెనుకబడిపోయెను. ఈమతము లాటంకపఱుప కుండిన ప్రపంచము చాల తీవ్రముగా వృద్ధిపొంది లోకసంగ్రహమై యుండెడిది. నా యభిప్రాయమును కొన్ని నిదర్శనములచే సమర్థింతును.

మొట్టమొదటిది మతములు జనులను వంచించుచున్నవి. మతగ్రంథము లన్నియు మనుష్యులచే వ్రాయబడినవి. కాని అట్లనిన యెవ్వరు నమ్మరు. అందుచేత సర్వ మతములవారును తమతమ గ్రంథములు „అపౌరుషేయములు" అని యనుచున్నారు. ఇంతేకాదు. కొందరు తమ గ్రంథములు ఆకాశమునుండి పిడుగురీతిగ భూమిపై దిగివచ్చినవనియు, మరికొందరు సాక్షాత్తు

# పల్లెటూరి ప్రజల నివేదనము

## సూచన

(విలేఖకుల యభిప్రాయములు పత్రికయభిప్రాయములు కానేరవు. విలేఖకుల వ్రాతలకు పత్రికాధిపతులుత్తరవాదులుకారు

గో. సం)

## గద్వాల వార్తలు

### సైంధవవధలో పట్వారీవధ

అజూర్ ౭వ తారీఖునాడు గద్వాలసంస్థానములో చేరిన పూడూరు అను గ్రామములో పట్వారీయగు పద్మభీమరావు అను పట్వారీని కొందరు హంతకులు చిత్రవధచేసిరి. ఈపట్వారీ ఆనాడే గద్వాలనుండి రైలుదిగి యింటికిపోగా యిద్దరు ముగ్గురు అతనివద్దకుపోయి "అయ్యా పురాణము చెప్పుదురా? అందరువినవలెనని కోరుచున్నారు" అని పిలిచిరట. ఆమీద పట్వారీ తన యింట్లో భోజనముచేసి రుమాలు పెట్టి ఒక బలిజయింటికి పోయెను. అక్కడ యొకసంచి భారతముపట్టుకొని వచ్చెను. పట్వారీ యిల్లుని కలిసికొని ఓయీ! సైంధవవధఘట్టముతీయి. అది చాలా రమ్యముగా నుండును." నంబి అదేప్రకారము గొంతెత్తి తనకువచ్చిన కూనరాగముతో సైంధవవధను జదువ మొదలుపెట్టెను. పట్వారీగారు అర్థము చెప్పుచుండెను. కొంతసేపటికి యొకనివెనుకనుండి యొకడు జుట్టుపట్టిపంచెనట. అమనుష్యుడు ఇదేమన్యాయము ఇట్లేల చేయుచున్నావు. విడువుడుమనెనట. అంతలో నింకొకడు వెనుకనుండి జంబియాతో పొడువగా రక్తము మిద్దెకుచిమ్మెనట. అంతలోననే యింకొకహంతకుడు గండ్రగొడ్డలి చేతపట్టి లోపలినుండివచ్చి పట్వారీమెడపై నరికెనట! గొంతుసగము తెగెనట. మరల గొడ్డలిపెట్టు వేయుచుండగా పట్వారీ వానిచేయి పట్టుకొనెనట అప్పుడే పట్వారీ పచ్చిపడెనట. అతడు పడేలోపలనే ఇంకొకహంతకుడు రోకలి (ముసలాయుధము) పట్టుకొనివచ్చి పట్వారీ తల చిదుగమోదెనట. అప్పై దేవరదున్ననుబాదినట్లు గంగాళి పోట్లపై యాయుధములతో పొడిచిరట.

ఆపై హంతకులు రెండుగంటలసేపు "హాలి హాలి" అని బజారులందుదిరిగి తర్వాత చీకటి పడువరకే హంతకులందఱును నేకస్థలమై యెచ్చటికో పోయిరట. వీరు యీ ఖూనీచేయుటకుముందు కర్నూలు (ఇంగ్లీషుజిల్లాకా)కు పోయి వచ్చియుండిరనియు, తర్వాతకూడ కర్నూలుకేపోయి అక్కడినుండి గుంటూరుప్రాంతములకు పారిపోయి నారనియు నంద్యాలకుపోవు మోటర్లపై యెక్కిపోయినారనియు జనులనుకొనుచున్నారు.

ఈ పట్వారీ బీదలకు చాలసహాయముచేసినవాడు. ఇతడుచచ్చిననాడు గ్రామములో మాలమాదిగలకుసైతరా జాతులవారు భోజనముచేయక చాలదుఃఖించిరి. ఇతనిభార్య ఆనాడే వ్యక్తురాలయినదని మామయింటినుండి జాబువచ్చెనట.

హంతకులింకను పట్టుపడలేదు. పంచనామాలు అయినవి. ఇకముందేమేమి రహస్యములు బయలుపడెనో యిట్టి బీదలయుపకారిని నేకారణముతో చంపిరో తెలియదుకుచంపిరో యెవరికెరుక.

---

### పోలీసువారిసోదా

ఈమధ్య ఒకచోట దొంగనాణెములు అచ్చువేయుచున్నారని తెలిసి ఔరంగాబాదుజిల్లా బోఖర్దన్‌తాలూకా, హసేనాబాదు పోలీసు సబిన్స్పెక్టరుగారు ఇద్దరియిండ్లను సోదావేసి ఒకముద్రాయంత్రమును కొన్ని దొంగనాణెములను కొనిపోయిరి.

---

### పిల్లుపడుట

పోయినవారమందు గుల్బర్గాజిల్లాకుచేరిన చింకోలిలో ఒకస్త్రీతుయిల్లు ఘోరవర్షముచే కూలిపడి. వానిభార్యయు యిద్దరుబిడ్డలును క్రిందనే పడిచచ్చిరి.

---

## గట్లనరసింగాపురం

(స్వకీయవిలేఖరి)

### జనతాసామ్రాజ్యపూజ

విజయదశమిరోజున ప్రతి సం॥ రెండుగొర్రెలను తీసుకవచ్చి పసుపు కుంకుమతో అలంకరించి నరుకుచుండెడి యాచారము ఎంతోకాలమునుండి వచ్చుచున్నది. ఈ సంవత్సర మటులచేయక గొర్రెలను తీసుకవచ్చి అలంకరించి చంపకయే వదలివేయవలెనని శ్రీయుత గుండవరపు జగన్నాథరావుగారు ఆజ్ఞాపించిరి. అటులనే జరుపబడినది. జన్మసిద్ధ అహింసానుగూర్చి ఉపన్యాసములుకూడ జరిగినవి.

---

## సూర్యాపేట

(స్వకీయ విలేఖరి)

## మగనాలిని మొగలాయిచేయుట!!

ఈ గ్రామమునందు నాయబ్ న్యాయవాదిగారియొద్ద మధురము అను మొహర్రిరు వుండెను. యతనికి అంతమ్మయను భార్య గలదు. కొన్నిదినములక్రింద కొందరు మందగిండ్రు మాయమైన దుర్మార్గమునకు త్రిప్ప ప్రయత్నించినట్లును ఆమె ముఖ్యముగా యిచటి పోలీసు [illegible]వారు యీమెను లేవదీసినాడనియు, అందువలన భర్తయగు మధురము స్థానికముల్కిపుసాహెబుగారివద్ద మొరబెట్టుకొనగా ఆయన యేమి సహాయము చేయనందున కొత్వాలి అమీనుగారితో సలహా చేసుకొనగా వారు చాలశ్రమపడి పరిశోధించి నాయెనిమిదిదినముల వచ్చునట్లు చేసినారట. అంతవరకు ఆమె యెచ్చటనున్నదియు తెలుసుకొనుట అసాధ్యముగా నుండెనట. పిమ్మట యీయుద్యమమునకు కారకులైనవారి ప్రయత్నము ఖాహాషకు విరుద్ధముగ పూర్తి యిట్లాభిన్నము అయినందున వకవేళ దేవళములో యీ మూడ్రోజులు బయల్పడినచో న్యాయశాస్త్రప్రకారము తమకేమైన చిక్కులు రాకుండుటకై తిరిగి అండవనాత్రి యామెను యింటినుండి లేవదీసి కొన్నిదినములు తెచ్చుటనో యుంచి పిమ్మట స్థానిక న్యాయాధిపతిగారివద్ద రహస్యముగా వక దరఖాస్తు యిచ్చిరట్టును అందు తనభర్త చాలాక్రూరుడనియు, అనుమానుడనియు, తనకు సరిగా భోజనముపెట్టుటలేదనియు, తనను కొట్టుచుండుననియు మొదలగు నేమేమో సంగతులు వ్రాసియున్నవట. మునసబుగారు శ్రద్ధతో మిసల్‌చేసి అంతమ్మ నా గృహములను యెవరికి తెలియకుండ తీసుకొన్నాడట. అంతలో అంతమ్మ జైబున్నీ సాగామారినట్లు పిమ్మట దూరస్థలములోనున్న అంతమ్మ తండ్రినికూడా పిలిపించి తనకేమి దావా లేనట్లు రహస్యముగా మునసబు సా॥ గారే వాఙ్మూలము తీసికొనినారట. ఎట్లో యీసంగతి సర్వగొండ కొత్వాలి మొహమెదీం గారికి తెలిసినదట యే కారణమునలో వారుకూడ మసీదుచేసి యెప్పటి నిరక్షరాసు నుడిచినట్లు మధురమును తనవద్ద కానిస్టేబిల్ నౌకరి దయచేసిరట. పిమ్మట అంతమ్మ కొన్నిదినములు [illegible] కారుయింటివుండి ప్రస్తుతము యెక్కడికో పోయినట్లు వదంతిగలదు. మధురముమాత్రము వ్యథతో నౌకరి చేయుచున్నాడు.

## "శీఘ్రబుద్ధిః పలాయనం,,

వెంపటి గ్రామకాపురస్థుడగు వెంకటపాపయ్య అనువానిని యచటి పరపతిసంఘ కార్యదర్శి యీమధ్యకాలమున సంఘద్రవ్యము అపహరించిన దని కొత్వాలివారు యతనిపై నమ్మకద్రోహ నేరము మోపి కోర్టుకు పంపిరి. కోర్టువారు వెంకటపాపయ్యను జమానతుపై వదలివేసిరి. చా॥ ౧౦ అజూరున యీ ముకద్దమా పేషీయుండగా వెంకటపాపయ్య వచ్చియుండెను. ఆనాడు కాకతా

ళీయ న్యాయముగా మా మున్సఫుగారి పరమమిత్రుడగు మౌల్వీ మహమూదలి హైకోర్టువకీలు కూడా వచ్చి కచేరీలోనే వుండిరి. పాపయ్య వకీలు రాలేదు కాని పేషీమాత్రము తబ్దీలు అయ్యి మరియొక తారీకు పేషీ నిర్ణయమై సంతకములు కూడా అయినవట. పేషీ తబ్దీలు కాగానే వెంకటపాపయ్య గ్రామములోకి పోయినాడు యింతలో పైరవికారు సాహెబు వెంకటపాపయ్య జమానతు ఫసఖుచేసిరిమాండు చేయుటకు దరిఖాస్తుపెట్టగా యజమానిగారు వెంటనే గ్రామములోవున్న వెంకటపాపయ్యను పిలిపించి రిమాండుకు తజ్వీజు చేయ నుద్యమించెను. ముల్జిము తన వకీలు లేడని మొత్తుకొనుచున్నను యజమానిగారు వినరందున పైరవికారు చెప్పిన ప్రకారము మౌల్వీ మహమూదలి హైకోర్టువకీలు హైద్రాబాదగారిని ప్రార్థించెను. వారుకూడా దయతో రెండువందల కట్నముపైననే ఆపద తొలగించుటకు అభయమొసగిరి. కాని సాయంత్రమువరకు వెంకటపాపయ్య పోలీసు రిమాండునందుంచబడియుండుటచే కట్నము యివ్వజాలనందున వకీలుగారు మరునటిదినము బహాసుచేయగలనని యజమానిగారితో చెప్పి ఫీసు తేగలందులకై వెంకటపాపయ్యను వదలిపెట్టించెను. ముల్జిము ఆపదతొలగుటచే ప్రతీకితిరా దేవుడా యని వెంటనే వెళ్లాయనమయ్యెనట. మర్నాడు వకీలుగారు మున్సఫుగారు, పైరవికారుగారు గంపెడాశతో వెంకటపాపయ్యకొరకు చూచిచూచి యానందము నిష్ఫలులైరి. వకీలుగారు సత్రీకేతులతో యింటికిపోయెను. మున్సఫుగారు మోసమునకు విచారపడి వారంటు దయచేసిరట. ముందేమి జరుగునో కదా!

## ఉద్యోగుల సంగీత నాట్యకళా పోషణ

కొంతకాలమునుంచి స్థానిక రాజకీయోద్యోగ ప్రముఖులకు సంగీతమునందును యభినయమునందును చాల యనురాగముగలుగుటచే కాబోలు అప్పుడప్పుడు ప్రత్యేకముగా నొకరిని పట్టణముకు పంపి యిచటి సుప్రసిద్ధ వేశ్యామణులగు లలిత, చిన్న కేరోబాఅను వారలను ప్రత్యేక మోటారుపై రావించి సంగీత, నాట్య, అభినయకళల ప్రదర్శింప జేయించుచు తాము సంతోషానందభరితులై తమ యాహ్లాదమును వెల్లడించుచుందురు. పకటి రెండు రోజులు యిలా జరిగిన పిమ్మట వారికి అధికారమునకు తగినట్లు పారితోషికమునిచ్చి తగు మర్యాదచేసి తిరిగి పట్నము సాగనంపుదురు ఒక్కొక జల్సాకు రానుపోను మోటారు ఖర్చులకు కట్నమునకు మిఠాయి, పండ్లు, పుష్పములు, తైలములు, మొదలగువానికి కొన్నివందల రూప్యములగును. శ్రీమంతులిట్లు యానంత సముద్రములలో నోలలాడుచుండ బీదరైతులు దుఃఖించుటకన్న వేరు సాధనము లేదయ్యె. ఈశ్వరాజ్ఞకు భిన్నముగ వర్తించుట కష్టము. ప్రతిగొప్పఅధికారి నగాదలా సమయమున యిట్టిజల్సాలు తరచూ జరుగుచుండును.

—

## జనగామ

—

ఇచటి యువజనగ్రంథాలయమునకు హైదరాబాద గౌలీగూడ వాస్తవ్యులగు మోటరుబస్సు కంట్రాక్టుదార్లున్న అబ్కారీకంట్రాక్టర్లునగు మ॥రా॥ రా॥ సరోజిసాహెబుగారు (ఫార్శీయువకులు) శాశ్వత చందాదార్లుగా నుండ నంగీకరించి సంవత్సరమునకు రు॥ 3౦లు చందా అనుగ్రహించిరి ౧ రు.లు విరాళమునందిసరి

సెక్రెటరీ

—

## గోరుచుట్టుపై రోకలిపోటు

— —

(ఒకవిలేఖరి)

కొలది కాలముక్రిందట ప్రజలు యావన్మంది మననిజాంరాష్ట్రములోకూడా బ్రిటిష్‌సామ్రాజ్యములోవలె వైరాపాలేరు ప్రాజక్టులు నిర్మింపబడునని మెట్టయావత్తుపల్లముగా మారునని సంతసించుచుండ లక్షలద్రవ్యము వ్యయముపెట్టి దయామయులైన ప్రభువుగారు ప్రాజక్టులను సిద్ధముచేయించిరి. చేయించినపిమ్మట బ్రిటిషుప్రభుత్వమువలెనే యీ ప్రాజక్టుల క్రింద సేద్యమగు భూములకు మెట్టసిస్తుతీసుకొని నీటితీరువ తీసుకుందురని ప్రజలు పేరాసతోవుండ ప్రజలకోరికలు గొంతెమ్మకోరికలై యకరకు రూ 3 ఏర్పాటు చేయబడెను. ఇందునుగురించి ప్రభుత్వమువారివద్ద ప్రజలు మొరపెట్టుకొని అబీకిస్తులో 1/4 వంతు శాశ్వతముగా మాఫి చేయించుకొనుటకు ద్యుక్తులైయుండగా వైరా ప్రాజక్టుప్రజలకు నవీనమైన పిల్లకాల్వలున్నని యకరకు రు 3 చొప్పున యివ్వవలసినదని నెలరోజులకుపైన జనాబుడిప్యుటీ అప్సర్ సాహెబుగారు వైరామకాంచేసి రైతుల యావన్మందిని పిలిపించి వినిపించిరి. ప్రజలు రానురాను కాల్వలున్న పూర్తి అయినపిమ్మట ప్రాజక్టులవన్నకూడా వచ్చునేమోయని భయాకులచిత్తులైరి. మెట్టపల్లముగా మారుటలో సాధారణముగా ప్రతిరైతుకు వందలయెకరములు పల్లమైనది ప్రభుత్వమువారు తకావీఅనుమద్దునుంచి రైతులకు అప్పుగాయిచ్చి యీకాలువలవన్నను

వసూలుచేసుకొనుట చెపరైతులను రుణబాధలకు లోనగాజేయుటయైనది. పిల్లకాలవవన్నులు రద్దుచేయించుకొనుటకై తరీఖారా తగ్గించుకొనుటకై ప్రజలు ప్రభువుదర్శనార్థమై నగరమునకు వెడలుచున్నారు.

—




మ. రా. శ్రీ. కేంద్రసంఘ కార్యదర్శి గారికి

అయ్యా!

—

తాము సుమారు రెండునెలలక్రిందట పోలీసు శాఖామంత్రులగు సర్ కర్నల్ ట్రెంచుగారితో ఆంధ్రకాన్ఫరెన్సు సమావేశ విషయమున సంప్రదించితిరని స్థానిక పత్రికలలో ప్రకటింపబడెను. కాని తాము దీనివిషయమై కర్నలు ట్రెంచుగారు యేమి సెలవిచ్చినది యిదివరకును తెలుపలేదు, దీనివలన తాము తమవిధ్యుక్తధర్మము నుపేక్షించితిరేమోయని భయమగు. ఇంతేకాక సర్ ట్రెంచుగారు సంప్రదింపు జరిగినపిదప తమకొకలేఖను కూడా వ్రాసియుండిరనియు, అందు కాన్ఫరెన్సు అధికారుల రెండువేల నగదుకొరకు మును దాఖలు చేయుటకును, ప్రభుత్వమువారి పాలిసీని ఖండించగూడదనియు, ఈ రెండుషరతులను యంగీకరించినచో ఆంధ్ర మహాసభ సమావేశమునకు అనుమతినొసగెదమని వ్రాయబడి యుండెననియు తెలియుచున్నది. దీనిపై తాము కొన్నిరోజులక్రిందట కేంద్ర సంఘ కార్యనిర్వాహక సభ సమావేశపరచినారట. అందు సభ్యుల అగ్రాంగీకార యభిప్రాయములచే, అధ్యక్షునకు నిరంకుశాధికారము పోలీసుశాఖవారికి జవాబునిచ్చుటకు నివ్వనైనదని తెలిసినది. కావున దయచేసి యీక్రింది ప్రశ్నలకు తగుసమాధానమొసగి, కాన్ఫరెన్సు జరుగగలదా లేదా తెలుపగలరని నమ్ముచున్నాను.

౧. తాము ట్రెంచుగారితో సంప్రదించు సందర్భమున ట్రెంచుగారేమనిరి! మీరేమి ప్రత్యుత్తరము లొసగితిరి!

౨. ట్రెంచుగారువ్రాసిన యుత్తరమును, దానికి కేంద్రసంఘమువారొసగిన ప్రత్యుత్తరము లేవి?

౩. కేంద్రసంఘమువారు తమ ప్రత్యుత్తరమును నిజాం రాష్ట్రాంధ్రుల యభిప్రాయములను తీసుకొని పంపిరా! లేక తమ నిరంకుశాధికారముపైననే పంపితిరా!

ప్రత్యుత్తరము సభ్యులందరి సమ్మతిపైననే పంపబడెనా! లేక కొందరి మోమాటముచే వారి నిరంకుశాధికారముపైననే పంపిరా? కార్యనిర్వాహకసభ్యుల సమ్మతిపైన పంపబడినచో వారు కార్యనిర్వాహక సమావేశములో గావింపబడిన తీర్మానమేల ప్రకటించబడలేదు?

౪. నిజాంరాష్ట్రములోని 2౦లక్షల ఆంధ్రుల యభివృద్ధికి మూలమగునట్టి ముఖ్య సమస్యను వారి యభిప్రాయము కొనకయే పంపుట న్యాయమా?

పై ప్రశ్నలకు ప్రత్యుత్తరములు త్వరలో పత్రికాముఖమున ప్రకటించి సత్యములను తెలిపెదరని నమ్ముచున్నాను.

ఆంధ్రవిద్యార్థి

—

# నీవు దర్శించియున్నావా?

## య డ్సు వ స్త్ర ము లు !

అలావుద్దీను బిల్డింగ్,

పత్థరుగట్టి, హైదరాబాద్.

---

చేతిగుడ్డలు మొదలుకొని కోటుగుడ్డల వరకు

అన్నియును కలవు.

E D 14

